ఓం

తత్సత్

# గార్గేయాగమమ్


సంగ్రహీత

సాహిత్య సింహ, పండిత భాష్యకారాచార్య

తపస్వి కవిపతి

బ్రహ్మశ్రీ యాలవర్తి ఆంజనేయ శాస్త్రిగారు

పీఠికాకర్తలు

బ్రహ్మాద్వైత, దేశికేంద్ర; పంచాగ్ని హోత

బ్రహ్మశ్రీ అంగలకుదిటి షణ్ముఖ శాస్త్రి గారిచే

లభ్యము





ప్రథమ ప్రకాశకులు

మతోద్ధారక, మతప్రచార

బ్రహ్మశ్రీ జిల్లెళ్ల వీర బ్రహ్మాచార్యులు

దువ్వూరు - కడపజిల్లా





వెల రు 0 - 8 - 0లు

# అరుణోదయ గ్రంధమాల

దువ్వూరు

★ చతుర్దశ గుచ్ఛము

సర్వహక్కులు ప్రకాశకునివి

ప్రథమ ముద్రణము

కాపీలు 500

దువ్వూరు అరుణోదయ ప్రెస్, నందు ముద్రితము



మన్మథ శ్రావణము.

1955 ఆగష్టు

మూల్యం 0=8=0

లభించుస్థానము

జిల్లెళ్ల వీరబ్రహ్మాచార్యులు

అరుణోదయ భవన్

దువ్వూరు పోష్టు

కడప జిల్లా

# విన్నపము

"విశ్వకర్మాది శామ్మతిస్సనః పశూన్పాతు
సోస్మాన్ పాతు తస్మైనమః
ప్రజాపతీ రుద్రో వరుణోగ్ని దిశామ్మతిస్సనః
పశూన్ పాతు సోస్మాన్పాతు తస్మైనమః
హస్తైసద్వరదా భయాంచిత గదా చంక్రాంకుశ శోల్లేఖనీ
ఖడ్గ శంఖ త్రిశూల పుస్తక భరైర్భాజం హృదజ్జేసితమ్
హస్త్యంబుక్షితి వాయుపుష్కరశశై ర్వహ్ని స్త్రీ నేత్రైర్యుతమ్
విశ్వబ్రహ్మాభిధం హిరణ్మయ తనుం హంసధ్వజం భావయే ॥

సర్వ మానవులు పరతంత్రులును, కించిజ్ఞులును, మాయా
తో కూడిన వారును, జ్ఞానహీనులును; నిత్య సంసా
శక్తిహీనులును, క్రియారహితులును; మాయాబద్ధు
అయివుండుటచే పరమేశ్వరుని అనుగ్రహమును పొం
ఉన్నత స్థితికి రాజాలక యున్నారు ఇందుకే

శ్లో॥ శివార్చన విహీనోయః పశురేవ నసంశయః
సతుసంసారచక్రేస్మిన్ అజస్రం పరివర్తతే॥

అనగా యెవరైతే పరమేశ్వరుని పూజ, అర్చన, వంద
విధులచే సంతృప్తి పెట్టజాలరో వారు నిజముగా ద్విపా
పు లనియు, అట్టివారు యీ జనన మరణ ఘోర సంసార
మునందు సర్వదా పైకి క్రిందికి తిరుగుచూ అనగా పుట్టు
చచ్చుచు నుందురేకాని మోక్షము పొందజాలరని చెప్ప
మన్నది. సర్వ రక్షకుడగు యీ పరమేశ్వరుని ఉపాసించు
మార్గములు రెండు ఎట్లన

శ్లో॥ శివజ్ఞానం ద్విధాజ్ఞేయం సగుణం నిర్గుణంతథా
ఆదౌసగుణ మాశ్రిత్య పశ్చాన్నిర్గుణ మాచరేత్

అవ్యక్తమైన యాపరబ్రహ్మము సాకారుడును, నిరాకారుడును, సగుణుడును, నిర్గుణుడును అయియున్నాడు. ఇట్టి వానిని ముందుగా సగుణోపాసన చేతనే సంతృప్తి పరచుట ముఖ్యమై యున్నది. తనుపరి నిర్గుణోపాసన కూడా ఆచరించుటకు ఆక్షేపణ యుండదు.

శ్లో॥ సగుణ జ్ఞానహీనస్య నహినిర్గుణ వేదనం
నందిదర్శన హీనస్య యధాన శ్శివదర్శనం॥

అనగా మొట్టమొదట నందిని దర్శింపక నే శివ దర్శనము లభింప దన్నట్లు సగుణ ధ్యానము లేక నే నిర్గుణధ్యానము సిద్ధింపదని ప్రమాణ ముండుటచే పరమేశ్వరుని సగుణ రూపముగా నిర్మించుకొని పూజా వందనాదు లొనరించి ముక్తి జెందవలసి యున్నందున నే ఆపరమేశ్వరుని శ్రీరామ, కృష్ణ, శివాద్యనేక నామములచే విగ్రహముల నిర్మించుట యావశ్యకమైనది. ఇట్టివిగ్రహములు.

శ్లో॥ శైలీదారు మయీలోహీ లేప్యాలేఖ్యాచ సైకతా
మనోమయీ, మణిమయీ, ప్రతిమా ష్ట విధాస్మృతా॥

అను ప్రమాణ మును బట్టి యీ విగ్రహములు శిలా, దారు, లోహం, చిత్ర, దర్పణ, మృత్తిక మనోకల్పితము రత్నములని ఎనిమిది విధములుగా నున్నవి. ఇట్టివాటిలో వారివారి శక్త్యాను సారమును బట్టి అనగా

"ఉత్తమం నవతాలేన మస్తకం చతురంగులం
ముఖద్వాదశ మానేన సార్ధ్రివా చతురంగులా॥

యని మయబ్రహ్మ చెప్పిన శిల్పశాస్త్రము ననుసరించి విగ్రహమును తయారుచేసి శుభదినమున శుభలగ్నమున ప్రతిష్ఠ చేయించి పూజించుట ముఖ్యమని ఆగమ గ్రంధములు వాకొను చున్నవి. యీ విగ్రహములు చేయుట యందును,

ప్రతిష్ఠించుట యందును; బ్రాహ్మణునకే యధికారము కలద ను విషయము అందరెరింగి నదియే.

బ్రాహ్మణులన

"బ్రాహ్మణం ద్వివిధం ప్రోక్తం ఆర్షే యం పౌరు షం తథా" అనుప్రమాణము ననుసరించి ఆర్షేయు లనియు, పౌరు షేయు లనియు రెండు తెగలుగ నున్నారు. ఆర్షేయు లన గా "జన్మనా జాయతే శూద్రః, కర్మణా జాయతే ద్విజః, వేదపాఠంతువి ప్రాణాం, బ్రహ్మజ్ఞానంతు బ్రాహ్మణః, అనువాక్యము రీత్యా పుట్టుకతో శూద్రుడును' కర్మచే ద్విజుడును; వేదపఠనద్వారా విప్రుడును, బ్రహ్మజ్ఞానము చేత బ్రాహ్మణుడును అయి నట్లు చెప్పుకొను నటువంటి వారొక తెగ

పౌరు షేయు లనగా "జన్మనా బ్రాహ్మణా ధ్యేయః, కర్మ ణ బ్రహ్మ చారిణః, వేద పాఠేన స్వాధ్యాయ బ్రహ్మ జ్ఞానేన వేత్తయే" అనుప్రమాణము రీత్యా. తండ్రి బ్రాహ్మణుడును, తల్లి బ్రాహ్మణి వీరిరు వురికి జన్మించు టచే బ్రాహ్మణుడును, కర్మ చే బ్రహ్మ చారియు, వేద పఠనచే స్వాధ్యా యుడును, బ్రహ్మజ్ఞానముచే బ్రహ్మవేత్తయు—మరియు "బ్రాహ్మ ణోస్య ముఖ మాసిత్" అను ప్రమాణముచే జగ న్నిర్మాణ కర్తయ గు పరమేశ్వరుని ముఖమునం దుద్భ వించుటచే బ్రాహ్మణుడు గను, "పురుషస్యముఖోద్భవ పౌరుషేయః' అనుప్రమాణము చొప్పున సృష్టి కర్తయగు పరమేశ్వరుని ప్రాగాది పంచ ముఖ ముల యందుద్భవించిన సానగ, సనాతన, అహభూన, ప్రత్న స సుపర్ణస యను పంచ బ్రహ్మల వంశమునం దుద్భ వించుట ద్వారా బ్రాహ్మణు లనియు "శిల్పమధ్యయనం నామవృత్తం బ్రాహ్మణ లక్షణం" బనియెడు ప్రమాణము ననుసరించి జగ న్నిర్మాణ పురుషుండగు యా విశ్వకర్మ పరమేశ్వరుని యాజ్ఞ

చొప్పున సర్వదేవ మానవావళి కుప యుక్తములగు అయో, దారు, తాంబ్రి, శిలా స్వర్ణ ములను అయిదు విధ ములగు దేవ, మానవ శిల్పముల నాచ రించుతూ ప్రపంచ రక్షణకొరకు వేదపారాయణమును చేయుటద్వారా బ్రాహ్మణులనబడు వారొ తెగగను రెండు తెగల వారుగ నున్నారు. యీయిరు తెగలవారు గో బ్రాహ్మలనియు విశ్వకర్మ బ్రాహ్మణులు, విశ్వ బ్రాహ్మణులనియు పిలువబడు చున్నారు. యీవిశ్వ బ్రాహ్మణులనేవిశ్వకర్మలనియు, శిల్పులనియు, శిల్పా చార్యులనియు, ఆచార్యులనియు; స్థపతులనియు, రథకారు లనియు, తక్షకు లనియు మొదలగు నామములచే పిలువబడు చున్నారు. యీ యిరు తెగలవారిలో దేవతా మూర్తుల ప్రతిష్ఠించుట కెవరి కధికారము గలదో కొంత విచారింతము.

"శిల్పినాం దేవకర్తృత్వం వంశ్యానాం విశ్వకర్మణః
అహం విశ్వస్య కర్తాచకర్తాకో మమశిల్పినః
శిల్పిగర్భాని లింగాని లింగగర్భాశ్చ శిల్పినః
శిల్పిరూపంతు మద్రూపం నభేదం శృణు పార్వతి॥

అని స్కంధ పురాణ ప్రతిష్ఠా ఖండము నందు చెప్ప బడి యున్నది. మరియు

"శిల్ప్యుత్పత్తిం ప్రవక్ష్యామి శృణుషణ్ముఖ యత్నతః
తదంగేషుచ సంభూతాః పుత్రాః పంచ జటాధరాః॥
హస్తకౌశల సంపూర్ణాః పంచబ్రహ్మరతాస్సదా
వాణిస్థాపక సంజాతాః మనుతులాశ్చక్ర శిల్పినః॥
సంధ్యాత్రయం ప్రకుర్వంతి స్నానదానాదితర్పణం
వైశ్యదేవం బలేర్దానం షట్కర్మణ్యాపి శిల్పినామ్॥
దేవార్చనరతాసిత్యం జప హోమాది కర్మసు
ఏవం విధిక్రియాఖ్యాత శిల్పినాం చైవషణ్ముఖః

విశ్వకర్మ పరాణాంచ బ్రహ్మ విష్ణు శివాత్మనామ్
తేషాంసూత్రసమాఖ్యాతం విశ్వనామస్వయంభువా॥
ప్రాసాదభవనాదీని లింగస్థాపనమేవచ॥

అనిస్కాంధ పురాణ ప్రభాసఖండ సోమనాధ మహా త్మ్యము నందును చెప్పబడి యున్నది. మరియు,

"జలధాన్యాది వాసంచ శిల్పాచార్యేణ కారయేత్
అన్యజాతి కకర్తవ్యం కర్తాభర్త వినస్యతి॥

అనగా జలధాన్యాధి వాసములను శిల్పా చార్యు డే చేయ వలయును. ఇతర జాతి వారు చేయ కూడదు. చేసిరేని చేసినవారును, చేయించిన యజమానియు నశిం తురు. అంతే గాక నా ప్రతి మయు జీవము లేని దగునని మయవాస్తు తృతీయా ధ్యాయమునందు చెప్పబడి యున్న ది మరియు అదే ఆధ్యాయ మునందు యీక్రింది విధము న చెప్పబడి యున్న ది,

"శిల్పిమాత శిలాపుత్రో దాసత్వం సద్వపూజకాః
కర్తవ్యం ఇంద్ర భోగశ్చ దిదంత్రివిధ లక్షణమ్॥
మాతామోహం పితాశిల్పిపుత్రాంశ్చ సర్వదేవతాః
సర్వేషాం త్వష్ట్ర పుత్రాణాం దీక్షామోక్షకరోగురుః॥

శిల్పాచారితల్లి, శిలపుత్రుడు, పూజ సేయువారు పుత్రికులు; (సేవకులు) ఇవి యన్నియు లభించిన యడల నింద్ర సమాన భోగము జరుగును, ఇదితివిధ లక్షణము మరియు మోహము తల్లియనియు' శిల్పాచార్యుడుతండ్రి యనియు' సకలదేవతలు పుత్రులనియు, తెలుసుకొవల యును. సకలమైన బ్రహ్మ సంతతికిని దీక్షను యిచ్చువా డు త్వష్టపుత్రుండైన శిల్పాచారి ఇతనిని గురువని యెరుం

గవలయును అనిచెప్పబడినది. మరియు,

"అశేషభూతోద్భవ కర్మకర్తా
సురా సురాణాంచ గురుస్తథైవ
విశ్వస్యసృష్టి స్థితి నాశహేతుః
శ్రీవిశ్వకర్మాఽఖిలదేవ ముఖ్యః॥

సకలమైన దేవ దానవులకు నుపయోగ కరములగు చిత్రపు పనులను, విగ్రహములు, గృహములు, మొదలగువానిని చేయుటయందు బుద్ధిమంతుడును; విశ్వమునకు సృష్టి, స్థితి, లయములను చేయువాడును, సకల దేవతలకు ప్రధానుడును' గురువును నగు విశ్వకర్మ అందరిలోను ముఖ్యుడని తెలిసికొనవలయును, అనియు ఇంతేగాదు

"నేత్రోన్మీలన పాత్రంచ వస్త్రంస్వర్ణశలాకికే
కుంభం ధాన్యంచ ధేనుశ్చశిల్ప్యా ధీనమితిస్మృతమ్॥

నేత్రోన్మీలన పాత్రియు; వస్త్రము, నేత్రోన్మీలన స్వర్ణశలాకలును, కలశమును, ధాన్యమును, గోవును ఇవన్నియు శిల్పాచారి ఆధీనములనియు తెలుసుకొనవలసినదిగా చెప్పబడినది. మరియు

"శిల్పినం పూజయే త్పూర్వం తస్యలక్షణ ముచ్యతే
ధేనుర్గజ తురంగాశ్చ పల్లక్యాంధోళికంతథా
కన్యాఃక్షేత్రాని గ్రామాశ్చ ఛత్రచామర సంయుతమ్
సమస్తా భరణంశ్చాపి శిల్పినాం తృప్తిభోజనమ్
ఏతేషాం సంప్రదాయేన కర్తవ్యం శిల్పిపూజనమ్
శిల్పినో మానసేతుష్టే దైవసంతుష్టి రేవచ
సర్వసంపత్తి సంపూర్ణం రాజా రాష్ట్రంచ వర్ధతే॥

ముందు శిల్పాచార్యుని పూజించు విధానమును

చెప్పెదను; ఆవులు, ఏనుగులు' గుర్రములు' పల్లకి, ఆం
ధోళికము, కన్యలు, భూములు, గ్రామములు, ఛత్రి,
చామరములు, సర్వాభరణములు మొదలగు వాని నెల్ల
నిచ్చి శిల్పికులస్థుల కందరకును తృప్తిగ భోజనముపెట్టిం
చవలయును, శిల్పి సంతోషించిన యెడల ప్రతిష్ఠించిన
దేవుడు సంతోషించును యజమానికి సకల సంపదలు
నిండియుండును. ప్రభుని రాజ్యము వృద్ధి నొందును
అని చెప్పబడి యున్నది మరియు గార్గేయాగమము ప్రథ
మాధ్యాయము నందు 34శ్లోకమునుండి 38వరకు యీ క్రిం
ది విధముగ చెప్పబడి యున్నది.

"సుదినంచ సువారంచ నక్షత్రం శుభమేవచ
సులగ్నంచ సుహోరంచ వాద్యఘోష పురస్సరం
యజమానస్సహచైవ నృత్యగీతాదిభిస్సహ
స్వస్తివాచన సహ శిల్పి ప్రవేశం శిల్పమందిరే
కర్తవ్యం తద్విశేషేణ వక్ష్యేశృణు సమాహితః
శిల్పాచార్యోశుచిర్భూత్వా పూజాంకృత్వాగణాధిపం
పశ్చాత్రి కలశంస్థాప్య స్వర్ణం రజితమేవచ
తామ్రంవామృణ్మయంచైవ పాత్రమేవం వినిర్దిశేత్॥

ద్వితీయాధ్యాయం మృత్తికా ప్రార్థన విధానం 1వ
శ్లోకమునుండి

ఓం బ్రహ్మపృధ్వీతిమంత్రేణ శిల్పీచ ప్రార్థయేద్భువ
భూమిర్భూమ్నేతిమంత్రేణ శిల్పివాతాభి మంత్రయేత్॥

తృతీయాధ్యాయం 21వశ్లోకమునుండి

దక్షిణేతు పరంస్థాప్య స్థపతిస్సృక్ స్రువాధృతః
అదితేనేతి మంత్రేణ పరిషిచ్యాగ్ని కుండకం

దర్భో త్వాజ్యేన సంగృహ్య హోమం కుర్యాద్యథావిధిః
ప్రజాపతయే స్వాహేతిమంత్రేణ స్థపతిక్రియాత్ ॥

ఇక్కడ "స్థపతి" శబ్దము విశ్వకర్మయని గ్రహించవలె
ను "స్థపతికారుభేదేఽపి" అమర కోశము 3 కాండము
స్థపతిస్థాపకశ్చైవ ఆచార్యో విశ్వకర్మణః "త్వష్ట"
శబ్దము కూడ విశ్వకర్మయనియే గ్రహించవలెను.
"దేవ శిల్పి న్యపిత్వష్టా" అమర కోశము

స్త్రవంచవాస్తు హోమంచ శిల్పికుర్యాద్యథావిధి
తత్పరంవాస్తు హోమంచ కుర్యాత్ శాస్త్ర విధానతః
వాస్తోష్పతేతి మంత్రేణ హోమంచాష్టోత్తరం శతం
తతః పరంచ కుండంచ అదితే న్వమన్యస్వా
మంత్రేణ పరిషిచ్యాథకుర్యాచ్ఛిల్పి యథాక్రమం॥

గార్గేయాగము త్రం 42=43 శ్లోకములు

యజ్ఞేనయజ్ఞ మంత్రేణ క్షీరస్నానం ప్రకుర్వతః
శిల్పాచార్య స్వహస్తేన పంచవారేతు నిక్షిపేత్
ఏతత్కార్యాత్పరంశిల్పీ సుఖాసీనశుచిఃపరం
పంచామృత స్నానమిదం కుర్యాద్దేవం యథావిధి ॥

అ॥ 5=శ్లోకం- 30-34

దర్భాసనం పరిస్తీర్య చిత్రాసన మథోపరి
శిల్పాచార్య శుచిస్నాత్వా స్థిత్వాచమ్య యథావిధి
ఓంభూరితిచమంత్రేణ సంకల్పంచ సమాచరేత్
కుండమధ్యే ప్రతిష్ఠాప్య కారకాగ్నిం యథావిధి
పాత్రాసాధనమేతద్ధిపూర్వవచ్చోదితంయథా॥

గా॥ 9 అ॥ 4వశ్లోకం

జ్యోతిర్నిర్మాణకో శిల్పీ బింబస్య గురురిష్యతే

జ్యోతిర్మండల మాలిఖ్య శిల్పాచార్యో మహాతపాః
బింబస్యదక్షిణే కర్ణే ఓంకారాష్టోత్తరం శతం
ఉపదేశ గురుశ్శిల్పీ స్సఏవ గురు ర్దైవతం॥
అ-13=శ్లో॥39

అని చెప్పబడి యున్నది. మరియు కాశ్యప శిల్పము 59వ పటలమునందును

"స్నపతిశ్చ శుచిర్భూత్వా యజ్ఞసూత్రోత్తరాన్వితః
ప్రాగ్వదగ్నిం సమభ్యర్చ్యస్విష్టపూర్ణాహుతించరేత్॥

మరియు సారస్వతీయ శిల్ప శాస్త్రమునందు వర్ణసంస్కార ప్రకరణములో

ప్రాతస్స్నాత్వా శుచిశ్శిల్పీ ప్రాప్తపంచాంగ భూషణః
హేమయజ్ఞోపవీతస్తు క్షౌమైర్వస్త్రై రలంకృతః

... ... ... ... ... ... ... ...

హేమసూచ్యా శిలాయాంతు లేఖయేన్నయనత్రయం
పశ్చాత్తీక్ష్ణేణ శస్త్రేణ మండలత్రయ ముల్లిఖేత్॥

అనియు చెప్పబడియున్నది మరియు బ్రహ్మ వాస్తువర్ణ వప్రథమ తరంగము నందు

కళాకౌసల్య యుక్తంచ శిల్పముత్యుచ్యతే ద్విజ
శిల్పశాస్త్రే కృతంకర్మ విశ్వకర్మ కులజైస్సదా
శుభావహై ర్దేవభక్తై స్నానసంధ్యా క్రియాపరైః
కర్తవ్యంచ ప్రతిష్ఠాద్యం అన్యవర్ణైర్నకారయేత్॥

అనియు చెప్పబడి యున్నది ఇట్లుఅనేక ప్రాచీనగ్రంధములయందు విశ్వకర్మ, విశ్వ బ్రాహ్మణ వంశీయులే దేవతా ప్రతిష్ఠలు, వాస్తు కర్మలు చేయ వలసి నదిగా చెప్పబడియుండినను దురభిమాన దుర్విదగ్ధులగు ఆక్షేపులు(గోబ్రా

హ్మణులు) కొందరు విశ్వకర్మ బ్రాహ్మణులకు ప్రతిష్ఠాధికారము లేదని మొండివాదనలు చేయుటయే గాక ప్రతిష్ఠాధికారముల గురించియు విశ్వ బ్రాహ్మణుల బ్రాహ్మణత్వసిద్ధిని న్యూనత పరచ వలె నని యు న్యాయా స్థాన ముల కెక్కి-పరాజయమునే వొందుచుట మిగుల చిత్రముగ నున్నది. ఆగమ గ్రంథాలను చక్కగా చూడకనే తెలుసు కొనకనే తెలుసుకొనుటకు నైనా ప్రయత్నించకనే చిలుక పలుకుల వలె నేవో కొన్ని వివాహాది మంత్రములు నేర్చుకొన్నంతనే కొన్ని చోట్ల ప్రతిష్ఠాది కార్య ములు అవక తవకగా చేయింపబూనుకొనుటయు అవిద్యా వంతులగు యజమానులను అమాయకులగు ప్రజలను చేరదీసికొని విగ్రహనిర్మాతలగు శిల్పాచార్యులను ప్రతిష్ఠా కార్యములందు ప్రవేశింప నీయకయు' ప్రతిష్ఠాది కార్యము లందు శిల్పా చార్యులకు చెంద వలసిన పూజాద్రవ్య మామూళ్ళను ; మర్యాదలను జెంద నీయకుండా చేయు టయు సహింప రానిదై యున్నది. పూర్వము శాస్త్రవిహితముగ శిల్పా చార్యులచే విగ్రహ ములు చేయించి వారి చేతనే ప్రతిష్ఠింప జేసిన దేవాలయములు నేటికిని యెంత పూజనీయముగ నున్నవో గుర్తించుదురుగాక.

పూర్వంశిల్పి ప్రతిష్ఠాప్య ద్వితీయా బ్రాహ్మణోక్తతా
అన్యదాకీర్తితంతత్తు రూపం నిర్జీవమేవహి
జలధాన్యాది వాసంచ శిల్పాచార్యేన కారయేత్
అన్యజాతనకర్తవ్యం కర్తాభర్త వినశ్యతి
ఆదిమూర్తి స్వయంశిల్పినభేదం శృణుపార్వతీ॥

ఇత్యాది ప్రమాణంబు లెన్నో యుండ జాతి మత్సరముచే బుద్ధిలేని పెద్దలుకొందరు.

తక్షాచ తంతు వాయశ్చ నాపితో రజకస్తథా
పంచమ చర్మకారశ్చ కారవశ్శిల్పినోమతాః॥

కొయ్యలు చెక్కువాడు, గుడ్డలు నేయువాడు(సాలె) నెత్తి గొరుగు వాడు (మంగలి—) గుడ్డల నుతుకు వాడు (చాకలి—) చెప్పులు కుట్టు వాడు [మాదిగ —] వీరందరు శిల్పులని వ్రాసియుండుట సహింపరానిదై యున్నది ఇతర జాతులను కూడ కించ పరచుటకు ఇటు వంటి శ్లోకములను ఎన్నిటిని చూపలేము. మచ్చునకు కొన్నిటిని మాత్రము ఉదహరించు చున్నాడను.

దేవో ముని ద్విజో రాజ వైశ్యశూద్రి బిడాలకః
పశుమ్లేచ్ఛ ఛండాలో దశవిప్రపరికీర్తితః॥

దేవతలు, మునులు, ద్విజులు రాజులు, వైశ్యులు, శూద్రులు, పిల్లులు, పశువులు; మ్లేచ్ఛులు, చండాలురు, యీపదిమంది విప్రులని పిలువబడుదురని అర్థము. మరియు

వృత్పత్తివృత్తమం శూద్రిం సతిశూద్రిత్వా సద్వదా
హాస్తివాపంచ శూద్రిత్వం అన్యవర్ణాచ శూద్రికః
శవంవస్త్రంచ శూద్రిత్వం దత్తపుత్రించ శూద్రికః
సేవకావృత్తి శూద్రిత్వం దాసికంజన్మ శూద్రికః
ఋషిబ్రాహ్మణ జన్మనాం అష్టశూద్రి పరికీర్తితా॥

పుస్తకతోనే శూద్రి కులమందు పుట్టి శూద్రస్త్రీనే పెండ్లిచేసుకొన్న వారును వంచనచే ఏగుల బట్టు వారును, సంకీర్ణజాతులకు పుట్టినవారును; శవములమీది వస్త్రములు ధరించు వారును, వకరికి దత్తపుత్రులు అయినట్టి వారును సేవకావృత్తిచే జీవించువారును, దాసిత్వము చేయు వారును ఋషిబ్రాహ్మణులకు బుట్టిన వారును యీ యెనిమిది మంది

యు శూద్రులని పిలువ బడు దురు. అనియు చెప్ప బడి నది.
మరియు

పరిభాతే విప్రదర్శంచ తటాకాః శతభిన్నయోః
అథవా వందనంచైవ కోటిజన్మంతు సూకరః

ఉదయ మున నే విప్రుని దర్శించి నట్లైన నూరు తటాక
ముల భిన్న పరచినంత పాపము కలుగు ననియు, అంతే గాక
వందన మాచరించిన కోటిజన్మములు పందిగా పుట్ట వలయు
ననియు చెప్పబడినది.

పరకార్య విహంతాచ డాంబికః స్వార్థసాదకః
చలద్వేషీ మృదుకూరో విప్రామార్జాల ఉచ్యతే॥
విప్రాత్ క్షత్రియకన్యాయాం సంభోగేసముద్భవే
నామ్నా వైఖానసస్తస్య వృత్తిర్విష్ణోశ్చ పూజనం॥
పురాక్షత్రియవర్గేతు వినాశం భార్గవాద్గతే
తత్కన్యకా ససంహాత విప్రభ్యశ్చ నియోగవః॥
భట్టనీషు యథామాతా విదితా సుతనైకికః
అతఏవహి క్షేత్రాంచ భట్టుకబ్బ ప్రదానదా॥

అనగా ఇతరులకార్యము చెడగొట్టుట, డాంభికముచూ
పుట, స్వంత కార్య ములు సాధించుట, చలము ద్వేషము,
మృదుత్వము, క్రూరత్వము వీటన్నింటి యందును విప్రుడు
పిల్లిసమానులని చెప్ప బడినది. మరియు, విప్రుడు క్షత్రియక
న్యల సంభోగించగా పుట్టిన వారి పేరు వైఖానసు లనియు,
వారికి విష్ణుదేవాలయ ములందు పూజచేయుటయే వృత్తియ
నియు చెప్పబడినది ఇంతే గాక పూర్వము పరశు రామునిచే
రాజులందరు చంపబడగా వారి స్త్రీలకు నియోగింప బడిన
విప్రులకు పుట్టినవారు నియోగులనియు, (అట్టివారే కొందరు

పాప రాజు, గోప రాజు, ఇత్యాది రాజుశబ్దము వారి పేర్లకు చివర తగిలించు కొన్నట్లున్నది) మరియు భట్టు బనితను చేపట్టగా పుట్టినవారే వైదికులనియు, అట్టివారు భట్టు శబ్దముచే పిలువబడు చున్నారు (నారాయణభట్టు, సుబ్బా భొట్టు, గిరి భొట్టు ఇత్యాదినామములచే పిలువబడుచున్నట్లున్నది) ఇంకను

"అంత్యజాతి ద్విజాతిశ్చ ఏకఏవసహోదర
ఏకయోని ప్రసూతశ్చ ఏకశాఖేనజాయతే॥

అంత్యజాతి ద్విజాతి రెండును వకగర్భ మునుండేపుట్టినందున రెండునువకే శాఖయై సోదర భావము గలిగి యున్నది అని చెప్పబడి యున్నది. మరియు

"అమశ్రాద్ధంపత్రిగ్రాహ్య వికిరాన్నం ప్రేతభోజనం
అర్చకస్త్రిలఘూతశ్చశంహరి ద్వేషిణీతథా
నటకోబురుడశ్చైవ చాండాలా గ్రామపాచకః
నాపిత తంతువాయశ్చ శూర్పకార కిరాతకః
కైవర్త కుంభకారశ్చ రజకోలేఖినీస్తథా
ఏతేషాం గ్రామచాండాల సర్వకర్మ బహిస్కృతః॥

అనగా అమశ్రాద్ధముకు గ్రహించువారు, వికిరాన్నము భుజించు వారు, స్మశానము నందు భుజించు వారు, అర్చకుడు నూగులనూనె తీయువారు, శివ విష్ణువులద్వేషించు వారు, నటుడు, చాప అల్లు వారు, చాండాలురు కూలికి గ్రామములో వంటలు చేయువారు, మంగలి; నేతనేయువారు, చేటలల్లువారు, పక్షుల బట్టు వారు. చేపల బట్టువారు, కుండలు చేయువారు, గుడ్డల నుతుకువారు, గ్రామ లెఖలు వ్రాయువారు, వీరందరు గ్రామ చండాలు రనియు వీరందరిని శుభకర్మల యందు బహిష్కరించ వలయు నని యు చెప్ప

జేసినది యితరులకించ పర చుటకు ఇటు వంటి ప్రమాణము లెన్నియైనను చూప వచ్చు గదా! నానా యోనుల యందు పుట్టినవారు సైతము బ్రాహ్మణులు, ద్విజులు' విప్రులు అని పిలువబడు చున్నట్లే యీక్రింద చెప్పబడినవారికికూడ శిల్పు లనే పేరుతగిలించి నట్లున్నది "తక్షాత్రశంతు వాయశ్చ" అను శ్లోకమును బోలినట్టిదే మరియొక శ్లోకము కాశ్యపశిల్ప నివే దనలో యున్నది.

"విశ్వకర్మాచ శూద్రాయాం వీర్యాధానాంచ కారసః
తతోబభూవ పుత్రాంశ్చ నవైతేశిల్పకారిణః
మాలాకారః కర్మకార, శంఖాకార, కువిందకః
కుంభకారః కంసకారః షడైతేశిల్పనాంవరాః
సూత్రధారశ్చిత్రకారః స్వర్ణకారస్త థైవచ॥

అని చెప్పబడి యున్నది అనగా విశ్వకర్మ వంశీయుడు శూద్రస్త్రీయందు వీర్యాధానము చేయగా అట్టివీర్యమునకు పుట్టిన పూల దండలు కట్టువారు, ఇనుముపని చేయు వారు శంఖముల చేయువారు, నేతనేయువారు, కుండలు చేయువా రు, కంచుపని చేయువారు, ఆటాడించు వారు, చిత్తరువులవ్రా యువారు, బంగారపుపని చేయు వారు యీ తొమ్మిది మంది శిల్పులే నని వ్రాయ బడినది. మూల సిద్ధాంతము తెలి యక సాలె, మంగలి, కుమ్మరి' చాకలి; నాట్యము చేయు వారు చిత్తరువుల వ్రాయువారు వీరందరు శిల్ప శబ్దానికి సమ్మతించి యుండ వచ్చునేమోకాని వారందరు "విశ్వకర్మాచ శూద్రా యాం వీర్యాధానంచ కారసః" అను ప్రమాణము రీత్యా పైకులముల వారందరు విశ్వకర్మకు శూద్రస్త్రీకి జన్మించి నట్లు వప్పు కొనెదరా? అట్లు సమ్మతించినచో శిల్ప శబ్దము

వారికి అన్వయించదు గదా.

జాతులయొక్క మూలసిద్ధాంతముల దాచి స్వార్థము తో యితర జాతులను కించపరచి క్రుతి)మములో ఆధిక్యత త ననుభ వించిన నేరమున కయ్యేనేమొ నేడు నాయీబ్రా హ్మణ, వాల్మీక బ్రాహ్మణ, దేవాంగ బ్రాహ్మణ' మతంగ బ్రాహ్మణ' మొదలగు బ్రాహ్మణ నామ ధారుల వద్ద సేవ లు చేయుట యేగాక అన్నపూర్ణయని పేరొందిన భారతభూ మిలో అన్నపానాదులు విక్రయించుకొని జీవితములు గడు పుకొన వలసి వచ్చినట్లు తోచుటలో అబ్బుర మేమీ లేదు పురాకృత కర్మఫలముల ననుభ వించక యెవరికైనను తప్ప దు గదా.

ఏదిఎట్లులున్నను మనభారత దేశమునందు పూర్వము నుండియు కొన్నికొన్ని కార్యములు వృత్తులు కొన్నికొన్ని జా తులకు కేటాయించ బడి ఆ ప్రకారమే నిన్న మొన్నటి వర కు జరుగుచుండి నట్లు అనేక దృష్టాంతరములవల్ల తెలియు చున్నది కదా! అట్టి సత్యమును గుర్తించి వకరివృత్తికి మరొక రు అడ్డతగులుట వల్లను, తమ ఆధిక్యతకొరకు మరొకరిని కిం చ పరచుట వల్లను యే మాత్రము ప్రయోజన ముండదని విజ్ఞులు గుర్తించ ప్రార్థన.

అంటే మొదటి నుండియు దేవాలయములు, విగ్రహ ములు, రథములు మున్నగు నవి నిర్మాణ మొనర్చుట, ప్రతి ష్ఠించుట గర్భము నందే బ్రాహ్మణత్వము సిద్ధించిన విశ్వక ర్మ వంశీయులకే అధికారము కలిగి యున్నట్లు అనేక శ్రుతి' స్మృతి, పురాణేతి హాస' ఆగమ గ్రంథా దుల యందు చెప్పి యున్న సత్యాన్ని విజ్ఞులు గుర్తించి సత్పథమున నడువ గ ల

రని ఆశించు చున్నాడను.

ఈగ్రంథము పేరు "గార్గేయాగమం" దీనిని గార్గేయ
ఋషి వ్రాయ బడినది గార్గేయు డనగా యీ పేరుతో యిద్ద
ఱు ఋషులు యుండినట్లు తెలియు చున్నది "గర్గపుత్రస్య గార్గే
యో:" అనియు -గార్గేయో గార్దభస్సుతః॥ యనియు చెప్ప
బడిన ప్రమాణ ముల బట్టి గర్గ ముని యొక్క కుమారుడు
గార్గేయుడొకరు, గార్దభము నకు పుట్టిన గార్గేయు డొకరు
యిద్దరుగా యున్నట్లు గ్రంధములయందు వ్రాయబడి యున్న
ది ఇట్లనుటలో గాడిదెకు మానవ (ఋషి) జాతి యుత్పన్నమ
మగునాయని కొందరు సందేహ పడ వచ్చు కాని వజ్రసూచి
కో పనిషత్తు లోని "ఋష్యశృంగో మృగేజాతః -జంబుకో జం
బుకోత్పతిః-గౌతమో గౌతసంభవః-వాల్మీకో వల్మికోత్పత్తిః-
అగస్త్య కుంభసంభవః -మాండవ్యో మండుకీ సుతః- శునకీగ
ర్భసంభూతో శౌనకాది మహాఋషిః" అను ప్రమాణ మును
బట్టి జింక, నక్క' కుక్క, కుందేలు; కప్ప ఇట్టి జంతు వుల
కే గాక నది, పుట్ట, కుండలలో కూడ ఋషులు పుట్టి నట్లును
అట్టివారే మునులై నట్లును చెప్ప బడి యున్నది గదా! ఏదిఎ
ట్లున్నను యీఆగమము వ్రాసినది గర్గ పుత్రుండైన గార్గే
యుడని పలువురు పండితుల యభిప్రాయ మైయున్నది.

దేవతా ప్రతిష్ఠల విషయమై నాకును ఇతరుల కును
జరిగిన వాదముల యందు యీగార్గేయాగమము యొక్క
ప్రాశస్త్యమును విన్నానుకాని అది నాకు లభింపమికి మిక్క
లి చింతిల్లు చూ గ్రంథము కొర కై అన్వేషించు చుంటిని
ఇట్టితరి గుంటూరు జిల్లా పెట్లూరు నివాసియగు శిల్ప పండిత
బ్రహ్మశ్రీ. తియ్యబిండి వీరభద్రా చార్యులుగారు పురాతన

మైన వక వ్రాత ప్రతిసి దయతో నా కొసంగిరి అట్టి దాన్ని
వందనములతో నందుకొని పరిశీలించగా అందులో కొన్ని
కాగితములు శిథిలములైన చోట్లగల శ్లోకములను వ్రాత
తప్పులను సవరించుకొన శక్తి చాలక యుండి వకప్పుడు పం
చాగ్నిహోత బ్రహ్మశ్రీ. అంగలకుదిటి షణ్ముఖ శాస్త్రిగా
రు తటస్థించగా యీగ్రంథమును సవరించి యివ్వ వలసినది
గా వారిని ప్రార్థించ అందులకు వారు తనవద్ద సాహిత్య సిం
హ, తపశ్చక్రవర్తి బ్రహ్మశ్రీ యలవర్తి ఆంజనేయ శాస్త్రి
గారు సేకరించి పెట్టిన శుద్ధప్రతి యున్నదనియు, అట్టిదిగ్రం
థరూపేణ ముద్రిణ చేయు నట్లైన యిచ్చెద ననియు చెప్పిరి

అందుకు నేను ఋషిప్రోక్తమగు ఆగమ గ్రంథవ్యాప్తిని ఆకాం
క్షించి సరేనని సమ్మతించి తీసుకొని యీ గ్రంథమును
ముద్రించి మీ యెదట నుంచి నాడను. ఇట్టి కార్యమునకు
తోడుపడిన బ్రహ్మశ్రీ తియ్యబిండి వీరభద్రాచార్యుల
గారికిని' బ్రహ్మశ్రీ అంగలకుదిటి షణ్ముఖ శాస్త్రి గారికి
ని వందన శతంబు లర్పించుచు సంస్కృత భాషయం దెట్టి-
వ పాండిత్యము లేని వాడ నైనందున యీ గ్రంథముద్రిణ
ములో కొన్నితప్పులు దొరలినవి అట్టితప్పులనేగాక యింకను
అవసరమూలని తోచిన చేర్పులు; మార్పులు, పండితవర్యులు
తెలిపిన ద్వితీయ ముద్రణ యందు చేర్చి ప్రచురింప గలనని
యు. సత్ప్రమాణ ములతో సాంఘిక, ప్రజల కుపయోగప
డు అముద్రిత గ్రంథముల పంపించిన వందనములతో నందు
కొని ముద్రించెద ననియు విన్నవించు చున్నాడను.

| ప్రకాశకుడు<br>దువ్వూరు | ఇట్లు<br>జిల్లెళ్లవీరబ్రహ్మాచార్యులు, |
|---|---|

# విమాన శాస్త్రము

ఈగ్రంథము ప్రాచీన కాలమున "భరద్వాజమహర్షి" చే వ్రాయబడిన యంత్ర సర్వస్వము లోని వైమానిక ప్రకరణము. యిదివరకు ఇట్టిగ్రంథము మనదేశమున వెలువడి యుండలేదు యీగ్రంథము నందు [1]విమాన శబ్దార్థ విచారము [2]విమానము యొక్క 32రహస్యములు' అనగా [1]మాంత్రిక [2]తాంత్రిక [3]కృతక [4]అంతరాళ [5]గూఢ [6]దృశ్య [7]అదృశ్య [8]పరోక్ష [9]అపరోక్ష [10]సంకోచన [11]విస్తృత [12]విరూపకరణ [13]రూపాంతర [14]సురూప [15]జ్యోతిర్భావ [16]తమోమయ [17]ప్రళయ [18]విముఖ [19]తార [20]మహాశబ్ద విమోహన [21]లంఘన [22]సార్పగమన [23]చాపల [24]సర్వతోముఖ [25]పరశబ్దగ్రాహక [26]రూపాకర్షణ [27]క్రియాగ్రహణ [28]దిక్ప్రదర్శన [29]ఆకాశాకార [30]జలద రూప (31)స్తబ్ధక (32)కర్షణ రహస్యములు గలిగి అద్భుతమును గొల్పునట్టిదై యున్నది శత్రువుల విమానములను విధ్వంసన మొనర్చునట్టి ఆయుధ ఆవర్తములు కూడ కలిగి యున్నది.

ఈగ్రంథమును వైదిక రిసర్చిస్కాలరు శ్రీ.శ్రీ ప్రియరత్న ఆర్షగారు హిందీ అనువాదము చేసి ప్రకటించి యుండ అద్దానిని అనేక వ్రియ ప్రయాసలతో తెలుగులో కొద్దిప్రతులు మాత్రమే ముద్రించి యున్నాము ఆలసించిన ఆశాభంగమని చెప్పుట అతిశయోక్తిగాదు గ్రంథమును చూచిన మీకే తెలియ గలదు.

దీని వెల రు0 - 8 - 0లు మాత్రమే పోష్టుఖర్చులు వేరు

వెంటనే జే. వీరబ్రహ్మాచార్యులు' అరుణోదయభవన్

దువ్వూరు పోష్టు, కడప జిల్లా' అనివ్రాయుడు

## ఉపోద్ఘాతము

యేభిఃశిల్పైః పప్రథానామదృగ్ంహత్
యేభిర్ద్యామభ్య పింగంశత్ప్రజాపతిః
యేభిర్వాచం విశ్వరూపాగ్ం సమవ్యయత్
తేనేమమగ్న ఇహావర్చ సాసమర్ధి"(త్రై.బ్రా)

విశ్వకర్మ ప్రజాపతి యేకర్మకౌశలముచేత విస్తారమయిన యీపృధివిని దృఢముగా జేసెనో యేశిల్ప మహత్త్వముచేత స్వర్గలోకమును సూర్యచంద్రతారకాది నానా రూపములతో బ్రకాశింపజేసెనో, యేశిల్పసామర్థ్యముచేత చరాచరాదిసమస్తరూప సముదాయమును సృష్టించెనో, యట్టిశిల్పజాలముచేత నీలోకమున నీరాజును సర్వసమృద్ధి గలవానినిగాజేయుమనుప్రార్థన మిందుగలదు. శిల్పముసర్వతోముఖమైనది. కనుకనే "కర్తాశిల్పసహస్రాణాం త్రిదశానాంచవర్ధకిః" అనుప్రసిద్ధి కలిగినది. వేదకాలమునుండి సూత్రకాలముగడచి పురాణకాలమువరకురానురాను మంత్రకాండాదులు కల్పింపబడివృద్ధియైనవి. పురాణములకు బలముచేకూర్చుటకై శిల్పులురూపధ్యానాదులను గల్పించి విగ్రహములజేయుటయు, నావిగ్రహములకు వివిధరూపములతో నాలయాదులనిర్మించుటయు సాగించిరి. అయ్యెడ శిల్పాచార్యుడే సమస్తమంత్రయంత్ర తంత్రకలాపాదుల యందాచార్యుడై తగినయనుచర వర్గముతో బ్రతిష్ఠాదికముల నిర్వహించుచుండెడివాడు. అచటవాస్తుద్రవ్యాదులుతనయధీనములే "వాస్తుపూజనసాహిత్యం స్వయంగృహ్ణాతి సర్వశః దేయాన్వగురుణాసమ్యక్ విశ్వకర్మాద్విజోత్తమే"(వా. మా) ఇట్లుసమస్తాధికారములు శిల్పాచార్యునికే చెప్పబడినవి కనుక విశ్వబ్రాహ్మణవంశమున శ్రేష్ఠుడును, సమస్తధర్మ

ములు దెలిసినవాడును, వేదవేదాంగముల నభ్యసించినవాడు
ను, సాముద్రిక గణితజ్యోతిశ్శాస్త్రముల నెఱిగినవాడును, లో
హ పాషాణ కాష్టేష్టకసుధాది చతుష్షష్టికర్మమర్మముల నెరిగిన
వాడును, సూత్రశాస్త్రక్రియలయందు బ్రవీణుడును, వాస్తువిద్య
యందధికుడును. శైవవైష్ణవ శాక్తేయగాణాపత్యబౌద్ధకాపాలి
కాదిషణ్మతాచారముల దెలిసిస్థాపించినవాడును, శ్రౌతస్మార్తాది
యక్రియలలో బ్రాజ్ఞుడును, మంత్రతంత్రముల నెఱిగినవాడును,
స్నానసంధ్యాద్యనుష్ఠానపరుడును; సత్యవాక్యముకలవాడును, స
దాచారసంపన్నుడును, కుశలబుద్ధిగలవాడును, సప్తవ్యసనవర్జితు
డును, ఏకపత్నీవ్రతుడును, ఆరోగ్యముకలవాడును, అయిన నేత
ప్ప శిల్పాచార్యత్వమున కర్హుడు కాడనికట్టుబాట్లు పెట్టిరి. అం
దువలననే "శూద్రకోటిసహస్రాణా మేకవిప్రప్రతిష్ఠితం వి
ప్రకోటిసహస్రాణా మేక శిల్పిప్రతిష్ఠితం' అని తెలిసినవారనమొ
దలిడిరి. వాస్తుపూజయందు సైతము "వాస్తుపూజావిహీనశ్చ
సూత్రధారైర్వినాయతః సప్తజన్మాభవేత్ప్రేమః ర్తానరకంవ్ర
జేత్" అనియు "యః పూజయేద్వాస్తుమనేన భక్త్యానతస్యదుఃఖం
భవతీహకించిత్. జీవత్యసౌవర్షశతం సుఖేనస్వర్గేవసంస్థితి కల్ప
మేకం" అనియు వ్యాసమహర్షియే నుడివియున్నాడు ఇకవిగ్రహని
ర్మాణాదులగూర్చి పరశివ విశ్వకర్మాగమము, గార్గేయాగమ
ము మొన్నగునిరువదినాలుగుకలవు. శిల్పగ్రంథములు చాలకల
వు. ఆగమములెన్నియున్నను శిల్పాచార్యుడు తనభృత్యవర్గముతో
శైలసమీపమునకుగాని సాగరమధ్యమునకుగాని వెళ్లుటయు,
నది మొదలు విగ్రహనిర్మాణమేమి, ఆలయగోపురధ్వజరథా
ది వివిధ నిర్మాణములేమి ఏమంత్రముతో నేకాలమున నేది

చేయవలయునో యది చేయు చుదనదీక్షను విగ్రహాప్రతిష్ఠానంత
రమున వదలునట్లు సమస్త శిల్పాగమ గ్రంధములు చెప్పుచు
న్నవి. ఆయుదాహరణము లన్నియునిట జూపదలచినచో గా
ర్గేయాగమమును మించునంతటి విస్తారమగుటలో సంశయము,
లేదు, శిలాపరిశీలనమున జెప్పబడినట్లు 7 శ్వేతజాతులు 8 ర
క్తజాతులు. 7 పీతజాతులు 10 కృష్ణజాతులు గ్రహించవలయు
ను. రేఖాదోషములు3 బింబదోషములు8 కళంకదోషములు4
సంకర దోషములు32 శిలాజాడ్యములు శాంత రూక్షాదిస్వ
భావములు జీవనిర్జీవ పరీక్షలు బాల్య యౌవనవార్థకాది పరిస్థి
తులు స్త్రీపున్నపుంసక భేదములు మున్నగు సమస్తాంశముల
ను గ్రహించి ప్రతిష్ఠాకాలమున సధోపార్శ్వోర్ధ్వ దృష్టులు
లేకుండ వరిశీలించుట కెన్ని సూత్రములు చెప్పబడయున్నవో,
నవరసాదులచే నొప్పు దృష్టి భేదముల నెట్లుకల్పించవలయు
నో, యవియన్నియు స్థపతి కెరుకగాని సామాన్యుల కేమాత్ర
ముబోధపడదని నిరాఘాటముగా జెప్పవచ్చును. పరశివ విశ్వక
ర్మాగమమునందు శిల్పిసమర్థను బరిశీలించగా నతడు సాక్షా
త్పరమేశ్వరుడేయని నామస్సునకు రూఢియైనది. మారీచమను
గ్రంధమునందు భూగర్భలబ్ధమైనవియు, జలగర్భలబ్ధమైనవియు
నగువిగ్రహములను బ్రతిష్ఠించుటకు శిల్పాచార్యుడు లభించని
యెడల పరివారాది దేవతలను ప్రతిష్ఠించుటకు నైతము

"ప్రతిష్ఠాదివసాత్పూర్వే తృతీయే వాపంచమే వా
సప్తమే వా శిల్పినా అమంత్రిక పూర్వం కారయిత్వా"

అనివ్రాయబడి యున్నది. అనగా సర్వసమర్థుడయిన శిల్పాచా
ర్యుడు లేకున్నను దద్వంశీయుడగు నొకబాలుని చేతనైన

మంత్రశిల్పాదులు లేకపోయినను సంస్కారములన్నియు జరిగించినగాని యావిగ్రహమునను జీవకళ రాదని యందలియు ద్దేశము. అది కానక కొందఱు వైఖానసులు మొదలగువారు శిల్పితో నవసరములేదనియే కువాదనకు బాల్పడి యిట్టియాగమ గ్రంథములను జూచి కువాదమును దామే యుపసంహరించుకొనుట యెన్నియో ప్రదేశములందు జరిగినది

"ప్రతిష్ఠాదివసాత్పూర్వే పంచమేదివసే శుభే
శిల్పినాసుకృతాయాంతు ప్రతిమాయాం విశేషతః"
స్థపతిర్యజమానశ్చ నవరత్నై విశోధ్యతే
కుంభంచకరసంస్థాప్య ముదకాభ్యామనాస్వయా"
ప్రోక్ష్యః పుణ్యాహమేవాత్ర కుర్యాద్ద్విజవరైస్సహ
అలంకృత్వాచతాంపశ్చాత్ గీతవాదిత్రనిస్వనైః
ప్రదక్షిణత్రయంకృత్వా ఆలయం వేదఘోషణైః
ముఖబంధముత్తరీయంచ స్థపతిర్ధారయేచ్ఛనైః"
వేదిః పశ్చాత్తువిన్యస్య ద్విభుజేధాన్యరాశికం
తండులంతుతథాపూర్వం తస్మాదుపరివిన్యసేత్"
......గర్భాలయే ప్రతిష్ఠాప్య దేవతామూర్తి తత్రధా"
స్థపతిఃసూత్రవిన్యాసం కృత్వాచైవాష్టబంధనం,
స్థపతిఃస్నాపయేత్పశ్చాత్, పూజకస్త్వపిపూజయేత్" [వి.శి]

ఇట్టియాగమ శాస్త్రముల నొకపరి పరీక్షించినచో సంశయములెల్ల బటాపంచలగును

"శిల్పిరూపంతుమహాత్రిపం నభేదః శృణుపార్వతి"
యని శివుడు పార్వతితో వచించెను, యజ్ఞాదులయందు సైతము శిల్పాచార్యుని దేపప్రధానస్థానము"

"యజ్ఞకర్మణియేవ్యగ్రాః పూరుషాః శిల్పినస్తథా
తేషామపివిశేషేణ పూజాకార్యాయథావిధిః"
అని వాల్మీకివచనము దేవతామూర్తిని ప్రతిష్ఠించిన యనంత
రమున శిల్పాచార్యుఁడు ధర్మకర్తకు జలధారాపూర్వకమైనమం
త్రముతో దానము చేయవలెను తదనంతరమున ధర్మకర్త తన
యిష్టమువచ్చిన యర్చకునికి సమంత్రిక జలధారతో నొప్ప
గించవలయును ఇప్పట్టున దైవకార్య నిర్వహణములోని లోప
ములకు దగినపాపఫలము నీవయనుభవింతువుగాక! అనుశపథ
ముకూడనుండును. వాస్తుప్రతిష్ఠాకలాపములయందు శ్రామ
యాజకులను చరవర్గముగా నుండిరేని యప్పుడప్పుడు వారుచే
యుపితృకర్మలలోని మంత్రములు దొరలుచుండును అందువల
నదైవకర్మవ్యత్యయదోషము నైతము సంభవించుచుండును. క
నుకనే" అన్యజాత్యుద్ధృతం మోహాత్ కర్తాభర్తావినశ్యతి"
అనియు బ్రహ్మ వచించియున్నాడు మఱియు రథములు [11]
విధములని శాస్త్రములవలన దెలియుచున్నది రథోత్సవాదుల
యందు గూడశిల్పాచార్యుడు సారథి వేషముతో రథముపై
ముందుభాగమున నుండవలెను అర్చకుడు కుక్కుటాసనముతో
దేవుని కెడమవైపుననుండి విగ్రహమును కదలకుండ పట్టుకొ
నియుండవలెను స్వస్తివాచకులు రథమునకు వెనుకనుండవలె
ను నాట్యాంగనలు రథమునకు ప్రక్కనుండ వలయును పోతే
రమ్మ మొదలగు క్షుద్రదేవతా కర్మలందు శిల్పాచార్యుడుసిడి
మానుబండిపై నెక్కగ్రామస్థులు సమర్పించిన గుమ్మడికాయ
లు మున్నగునవి తానే స్వాధీనములో నుంచుకొనును ఇన్నియే
లవాస్తు శిల్పాది సమస్త కార్యములయందు శిల్పాచార్యుడు

ప్రథమపూజ్యుడు

"శిలామృణ్మయదారూణాం ప్రతిమానాం విశేషతః
నిర్మాతా ప్రథమః పూజ్యో ఆచార్యస్తు తథాపతేః (స వి)

"వివాహాదిషు యజ్ఞేషు గృహారామ విధాయతే
సర్వకర్మేషు సంపూజ్యో విశ్వకర్మా ఇతిశ్రుతం (వ.పు)

ఈగార్గేయాగమము చాలపురాతన మైనది దీనినింత వరకేమ హాశిల్పాచార్యుడు పరిశీలించి యుండలేదు పునర్ముద్రణము నందయిన నిర్దుష్టముగ సర్వాలంకార శోభితముగ వెలువడి లోకమున కెంతయు శ్రేయము నొసగూర్చుగాక!,

ఇట్లు

విమర్శకాచార్య<br>శిల్పకళా కోవిద } షణ్ముఖబ్రహ్మన్యాశవి.



# పరిచయము.

శైవ, వైష్ణవ, వైశ్వకర్మ్మణాది ప్రతిష్ఠాగమము లసంఖ్యాకములుగ నున్నవి. అనేకాగమము లిటీవల ప్రకాశితములైనట్లు వానిలోని విషయములనుబట్టి స్పష్టములగుచుండును. వీని యన్నింటను — విశ్వకర్మ దేవాది దేవుడగుటచే వైశ్వకర్మ్మణములగు నాగమములు సనాతనములని విమర్శకుల తలంపు. తరువాత శైవ — వైష్ణవ—శాక్తేయాద్యాగమములు వెలువడినవి. ఆధునికాగమములు పెక్కులుఆశ్చర్యకరములగు నాచార విధానములతోడను, హాస్యక ద్వ్యర్థములతోను వఱలుచున్నవి. వాని ద్వ్యర్థివైఖల్యము మొదలి విషయ ప్రతిపాదన రీతిచేతనే తెల్లమగుచుండును.

ఈ గార్గేయాగమము అతి ప్రాచీనములగు పరశివ విశ్వకర్మాగమావళులలోనొకటి. విశ్వకర్మ తత్వమును సమగ్రముగా నెఱిగినవాడు గర్గమహర్షి. ఆ గర్గునినుండియే తరువాత నారదాదులు విశ్వకర్మ తత్వమును; మహిమోదంతములను తెలిసికొని కృతకృత్యులైనట్లు మనకు ప్రమాణ గ్రంథములు చెప్పుచున్నవి. స్కాందపురాణాంతర్గతమగు నాగర ఖండమిట్లనుచున్నది.

గీ॥ మఱియు నచ్చట నే గార్గ్యమౌనివలన
విశ్వకర్మ పురాణంబువిని యదియును
బదియు రెండగు లక్షలపైనిగ్రంథ
సంఖ్య పదుమూడు వేలుగ జదివినాడ॥

సృష్టికర్త మహిమ నిట్లు సంపూర్ణముగా నెఱింగిన గర్గమహర్షి పుత్త్రుడు గార్గేయుడు మునీశ్వరుల కుపదేశించినదే యీగార్గేయాగమము కావున అత్యంత ప్రాచీనమును పరమ ప్రమాణమునగుచున్నది.

ఈ యాగమము పదునాఅధ్యాయములతో విరాజిల్లుచున్నది. ఈ పదునారధ్యాయములతో అంకురారోపణమాది ప్రతిష్ఠావిధానము సమగ్రముగా వర్ణింపబడియున్నది. దీనినాధారముగాజేసికొని ప్రతిష్ఠావిధానమును శాస్త్రీయముగా నిర్వహింపవచ్చును. కర్తాకారయితలేమి; శిల్పాచార్యులేమి, ఉపాసకులేమి ఈ ప్రతిష్ఠా పద్ధతి ననుసరించి ఐహికాముష్మికలాభముల నందగలరనుట సత్యము.

ఇంతవరకును తాళపత్రములలో తపస్సు చేయుచున్న యీగ్రంథమును బ్రహ్మశ్రీ అంగలకుదిటి షణ్ముఖశాస్త్రిగారి ప్రేరణచే ముద్రించి ప్రకటించిన అరుణోదయాధిపతులు ప్రతిష్ఠాతంత్రికాములగు ఆంధ్రుల ధన్యవాదములకు పాత్రులయినారు ఇందు లేఖక ముద్రాపకాది ప్రమాదములు పెక్కులు దొరలినవి ఈతూరి ముద్రణములోనివి సంస్కరింపబడి శుద్ధప్రతి చిక్కగలదని యాశింతము.

ఆంధ్రశిల్పకళాపరిషత్తు
తెనాలి
15-5-1954

ఇట్లు
పండిత
కొండూరు వీరరాఘవాచార్యులు,



సాహిత్యసింహ; పండిత, భాషకారాచార్య,
తపశ్చక్రవర్తి
బ్రహ్మశ్రీ యలవర్తి ఆంజనేయశాస్త్రిగారు,



బ్రహ్మాద్వైత దేశికేంద్ర:
పం చా గ్ని హో త,
బ్రహ్మశ్రీ అంగలకుదిటి షణ్ముఖశాస్త్రి గారు;



మతోద్ధారక ::

జిల్లెళ్ల వీరబ్రహ్మాచార్యులు.

ప్రకాశకులు.



శుభమస్తు.

# గార్గేయాగమమ్.

## ప్రథమాధ్యాయః



శ్లో. కదాచిద్దేవతావాస మమలంకామవర్జితం
ఫలపుష్పసమాకీర్ణం వృక్షరాజ విరాజితం
శుకశారిక ఘల్లూక వ్యాఘ్రసింహాదినాదితం
సర్వర్షిప్రవరైర్యుక్తం నిర్మలోదక సంయుతం 2
బదరీకావనంతత్ర ఋషయోమునిపుంగవం
తపస్యంతం మహాధీరం సర్వ వేదార్థ సంయుతం 3
గర్గపుత్రం మహాసౌమ్యం శిల్ప శాస్త్రానుమోదినం
తత్ప్రయోగవిదంపుణ్యం గార్గేయమృషిసత్తమం 4
ప్రణమ్యదండవద్భక్త్యా తమయాచన్మహర్షయః
దేవదేవ మహాదేవ వరసంయుక్తధీవర 5
సర్వశాస్త్రార్థతత్వజ్ఞ ప్రతిష్ఠాగమసంగ్రహం
వదనః పరమః ప్రీత్యా భక్తానాంలోక పూజితం 6

గార్గేయస్తామువాచైవం ప్రశ్నాన్సర్వహితాయవై
లోకానాముపకారాయ పురాకృతమనాదితం 7
శిల్పశాస్త్రమనంతంయ దృషిప్రోక్తం పురాతనం
వక్ష్యేతదన్వయంచాస్య ప్రయోగంశ్రూయతామిమం 8
నిరాకారో నిరీశోయః పరమాత్మాసనాతనః
పంచాస్యోదశబాహుశ్చ సాకారోపరమేశ్వరః 9
కోటిసూర్యప్రభాయుక్తః పంచాదశసులోచనః
తస్యసంకల్పమాత్రేణ చరాచరమభూజ్జగత్ 10
తత్రప్రాగాస్యసముత్పన్న స్సానగోమనురీశ్వరః
అవాచ్యాస్యోద్భవశ్శ్రీమాన్ మయో విష్ణుస్సనాతనః 11
ప్రతీచ్యాస్యోద్భవోబ్రహ్మ త్వష్టనామామహాభూవకః
ఉదీచ్యాస్యోద్భవఃప్రత్నస్త్వింద్రశిల్పీమహాయశాః 12
ఊర్ధ్వాననోద్భవస్సూర్యో విశ్వజ్ఞోభూత్సువర్ణకః
సంజాతఃక్రమతస్తస్మా ద్దృషయోవిశ్వకర్మణః 13
తచ్ఛక్తిఃపంచధాభూత్వా తానన్వావస్యయదాభవత్
తదాదిస్వర్గమర్త్యాది లోకాస్సంవృద్ధిమాగతాః 14
తత్పంచఋషివర్యాణాం మధ్యేశ్రీమాన్ మహాయశాః
భక్తసంరక్షణార్థాయ భక్త్యుద్పాదనహేతవే 15
విరాడ్రూపగుణాదీని వేదవాక్యైః ప్రకాశ్యచ
తదజ్ఞానచరాణాంతు లిఖిత తద్రూపమవ్యయం 16
శిలాదారుసుపత్రేషు సర్వేజాతుంసుదుర్లభం
తత్తత్ప్రయోగమేవంయః కురుతేమాంప్రతివద్యతే 17

ఏవముక్త్వామహాదేవో ఋషిభ్యఃప్రదదౌమయః
తల్లక్షణమిదంవక్ష్యే శిల్పాచార్యపురస్సరం 18
యోవాత్రిభక్తిసంయుక్తః కురుతేనిర్మలస్సుధీః
ససర్వఫలసంపన్నో పుత్రపౌత్రాదిభిర్యుతః 19
ధర్మకామార్థసంయుక్తస్త్వంతే మోక్షఫలాకరః
విష్ణులోకేసదాధ్యాయన్ వర్తతేఽతఃపరంకిము 20
తదగ్రేతుమహాధీరో భక్త్యానమ్రోత్తమాంగకః
శిష్యస్తత్వాథగార్గేయం ప్రార్థయామాసతంగురుం 21

శిష్యోవాచ—

స్వామిన్ మయాశ్రుతంప్రశ్న స్యోత్తరంవదమేవిభో
భవదీయప్రసాదేన వేదశాస్త్రాదికంతథా 22
జ్యోతిశ్శాస్త్రం సమగ్రంచ గృహీతం విబుధోత్తమ
శిల్పశాస్త్రక్రమంచైవ బోధయేదృషిసత్తమ 23

గార్గేయోవాచ—

అగస్త్యఃకాశ్యపశ్చైవ భృగుగౌతమభార్గవా
గాళాదిఋషివర్యాశ్చ బోధకోయవనోమునిః 24
పారాశర్యాదయస్సర్వే శిల్పశాస్త్రవిశారదాః
దైవజ్ఞోమానసారశ్చ దీప్తశ్చాత్రిమరిచికాః 25
వైఖానసోథకౌండిన్య శిల్పిశాస్త్రిషుధీమతాః
త్రైరేవోక్తంపురాతస్య శాస్త్రమానమిదంశృణు 26
విశ్వేసంవిశ్వసారంచ దావట్టంహానుమాణ్ణళం
వృత్తంసృష్టంభానుకంచ కర్పార్యంచసయిద్ధకం 27

మానసారం వాస్తుబోధం పారాశర్యమరిట్టికం
పిత్తారంకాశిభంసోమం విశ్వంవజ్రం విశాలకం 28
మగధ్రించిదరిమిందరించ వస్తువిద్యాపథంతథా
కపిలంవాస్తుకంవిశ్వ బోధకంచ బహుశ్రుతం. 29
మానబేదంచాదిసార విశ్వకర్మంచసర్వతః
ద్వాత్రింశత్శిల్పశాస్త్రాణి మయమతానివిదుర్బుధాః 30
తేషాంమతానుసారేణ వక్ష్యేహంతత్సువిస్తరం
సావధానేన సంగ్రాహ్యం శిల్పిశాస్త్రి యథాక్రమం 31
ఇత్యుక్తోగార్గిణంచైవ నమస్కృత్యతుశిష్యకః
కథంవాతత్రకర్తవ్యం కర్షణాద్యర్పనాంతకం 32

గార్గేయోవాచ

యద్దేవాది ప్రియోపప్రతిష్ఠవిదూషాం శాలాప్రవేశంపరం
విఘ్నేశ స్తుతి మంకురార్పణకుదం వాస్తోశ్చహోమంయథా
వాహంవాహక మంతరంపురవరప్రదక్షిణం కుర్వతాం
గవ్యంపంచక మృత్తుపంచస్నపనం క్షీరాదివాసంతతః
బింబంప్రాణప్రవేశనిత్యు మథతద్ధాన్యాధి వాసంచయ
న్మూర్తిర్హోమ మతః పరంచకురుతాం వైకల్యమంగాదిషు
హోమంగర్భవివేశనం త్వథక్రిమాత్ప్రి రశ్చసంస్థాపనం
రత్నన్యాసక మష్టబంధనక్రమం దృక్స్థాప్యమేవంవిధిః

శిష్య ఉవాచ—

కథంతత్రతుకర్తవ్య మారంభంకుత్రవర్తతే
సుదినించ సువారంచ నక్షత్రం శుభయేవచ 34

సులగ్నంచ సుహూర్తంచ వాద్యఘోషపురస్సరం
యజమానస్సహైవనృత్యగీతాదిభిస్సహ 35
స్వస్తివాచ సహాశిల్పి ప్రవేశం శిల్పిమందిరే
కర్తవ్యంతద్విశేషేణవక్ష్యేశృణు సమాహితః 36

గార్గేయోవాచ—

శిల్పాచార్యశుచిర్భూత్వాపూజాం కృత్వాగణాధిపం
పశ్చాత్రికలశంస్థాప్యస్వర్ణంరజతమేవచ 37
తామ్రంవామృణ్మయంచైవ పాత్రమేవంవినిర్దిశేత్
పంచప్రస్థాదికంధాన్యం తదర్థంతండులం తథా
ధాన్యప్రసారితంచైవ నిక్షిప్యకలశత్రయం
కలశేషుజలంపూర్య పల్లవాదిరలంకృతాః 39
సుధేవకలశాన్ దివ్యగంధ పుష్పాదిభిర్యుతాః
నారికేళసహాచైవ తాంబూలం దక్షిణం దదుః 40
ఇమమ్మేత్యాది మంత్రైస్తు పూజయేద్విధివత్తతః
స్వస్తివాచన పూర్వంతు కుర్యాత్పుణ్యాహవాచనం 41

ఇతిగార్గేయప్రోక్తే శాలాప్రవేశ గణపతిపూజా పుణ్యాహవాచనం నామప్రథమోధ్యాయః

# ద్వితీయాధ్యాయః



శ్లో॥ ప్రథమం శిల్పినంచైవ ద్వితీయంబ్రహ్మమేవచ

తృతీయమర్త్విజశ్చైవ చతుర్థం యజమానకం 1
యేతేషాంకంకణంబధ్వాచాశుతాంగృహ్యా తాంతథా
నవీనదీక్షావస్త్రంచ ధాగయేత్క్రమ మేవచ 2
సువర్ణకంకణంచైవ విప్రార్థంనిష్కమేవచ
అథవాచార్ధనిష్కంచసూత్రం చైవతుకారయేత్ 3
తత్సూత్రందక్షిణేహస్తే బంధయేత్సహమంత్రకం
తత్పరంతు సంకల్పంకుర్యాచ్ఛిల్పివరంశుచిః 4
ఏతదాలయప్రతిష్ఠాపన కాలేసర్వశాంత్యర్థందేశ
స్యాస్వస్త్యర్థం వేదవేదాంగవ్యాకరణ ఛందభట్టప్రభా
కరాభివృద్ధ్యర్థం గంగాయమునాది సర్వనదీనాంతీ
ర్థాభివృద్ధ్యర్థం కాలానుగుణ్య ప్రకారపర్జన్య ప్రవ
ర్షాధికజలాభివృధ్యర్థం త్రయస్త్రింశత్కోటి దేవతా
భివందార్థంసాలోక్య సారూప్య సామీప్య సాయు
జ్యాభిసిధ్యర్థం సకలమునినాంధ్యాన ధారణా
ద్యష్టాంగయోగాది సిధ్యర్థం అతిరాత్రవాజపేయపౌండరీక
శతక్రతూనాం సంపూర్ణఫలసిద్యర్థం రాజ్యాభి
వృద్యర్థం దేశాభివృద్యర్థం రాష్ట్రాభివృద్యర్థంరాట్
కనకకటకమకుటహారకేయూరాంగ మణికుండల
ప్రభాభాసమానార్థం శతాంగద్విరదతురంగ పదాతి
మంత్రిసామంత పురోహితాభివృద్యర్థం చక్రవర్తిత్వ
దిగ్విజయాంచిత లక్ష్మీనివాస సిద్యర్థం రాజ్యశాం
త్యర్థం రాష్ట్రానామఖిల సపత్సరంపరాభివృధ్యర్థం

అస్మిన్ గ్రామే జారచోరాగ్ని భయోల్కోత్పాత మారీజ్వరాది సర్వ పీడాపరిహారణార్థం ఏతద్గ్రామాభి వృద్ధ్యర్థం యజమానాయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధ్యర్థం ఏతదాలయాచార్యార్చక పరిచారకాభివృద్ధ్యర్థం వాస్తుపూజావాస్తుహోమపర్యగ్నికరణాభివృద్ధ్యర్థం శంఖుస్థాపనాద్యంకురార్పణ జలాధివాసధాన్యాధివా సనేత్రోన్మీలనదృక్స్థాపనాది బింబసిద్ధ్యర్థం కుంభ పూజకళావాహనాది సిద్ధ్యర్థం శాంత్యర్థం వృద్ధ్యర్థం స్వస్త్యర్థమభ్యుదయార్థంచ మహాశిల్పిభిస్సహాశిల్పి పుణ్యాహవాచనంకరిష్యే। పూర్వోక్తప్రకారేణ పున స్సంకల్పమాచరేత్

శ్లో॥ సువర్ణం రజితంచైవ తామ్రంవాచాథమృత్తికా
ద్వాదశాంగుళ మానాంయాంపాలికా బ్రాహ్మణోచితా
షోడశంక్షత్రియాణాంతు వైశ్యస్యైకాదశాంగుళం
అష్టాంగుళంతుశూద్రాణాం పాలికానాంవిధిర్మతా 6
హాటకం రౌప్యం తామ్రేవమృత్తికాయాతయాపివా
మయకుంభంతు నిక్షిప్యజలం పూర్యాయథావిధి 7
సోమంప్రతిమత స్యాంతేనిష్కమాత్రం సువర్ణకం
తన్మధ్యేచ వినిక్షిప్య సోమంవరుణదైవతం 8

ధ్యానమ్

కర్పూరాగరు వాసినీంసువిమలాం తాంటకహారాన్వితాం

ముక్తావిమ్రిసుభూషితాంగసుశ్శకరీంపూర్ణేందుబింబాననాం
నానావాద్యవినోదినీం శివకరీం చండీమహాభైరవీం
భక్తాలోక సురద్రుమాం సుజననీం ధ్యాయేత్సగంధామినీం
తతఃకుద్దాలకంగ్రివ్యా గంధ పుష్పాక్షతైస్సహ
తాంబూలదక్షిణాదీని శిల్పచార్యోమహాతపాః 10
పంచామృతంచ నైవేద్యం వాద్యఘోషపురస్సరం
స్వస్తివాచనయాచైవ పురంప్రివ్యప్రదక్షిణం 11
దేవాలయేచోత్తరేషు యీశాన్యేపూర్వభాగయోః
పల్మీకనికటంగచ్ఛ సుఖాసీనసుచిర్విధిః 12
వల్మీకంభక్తి సంపూజ్యధ్యానమావాహనాదికం
పంచామృతేన సుస్నాత్వాధూపదీపాదికంతతః 13
నైవేద్యంచైవ తాంబూలంస్వర్ణ పుష్పంచకారయేత్
ప్రదక్షిణంచ సంస్కారంకుర్యాచ్ఛిల్పి యథాక్రమం 14
ఓంబ్రహ్మశ్చపృధ్వీతి మంత్రేణశిల్పీచ ప్రార్థయేద్భవం
భూమిర్భూమ్నేతి మంత్రేణశిల్ప్యేవాతాభిమంత్రియేత్
పునఃకుద్దాలకం పూజ్యశాస్త్రచోదిత మంత్రితః
దేవదేవప్రతిష్ఠార్థం మృత్తికాముద్ధరిష్యతి 16
ఇతిప్రార్థిత పూర్వంతు వల్మీకంఖననం భవేత్
తస్మృత్తికాంసు పాత్రేతు మధ్యేనిక్షిప్యప్రార్థయేత్ 17
ఓం హ్రీం మృత్తికాదేవీనమః పూర్వప్రతిష్ఠితాం
మృత్తికాంపూజయిత్వాధధూపనైవేద్య భిస్సహ 18
చోధృత్య దేవయానేతువాద్య ఘోషసమావృతాం

గ్రామప్రదక్షిణం కృత్వా శాలాయాంతుప్రవేశయేత్ 19
నిక్షిప్యానంతరం శిల్పీసుఖాసీనశ్శుచిస్తతః
యజమానాదిభిస్సర్వైస్సహిత్వా [illegible] 20
అంకురార్పణ సంకల్పం పాలికాసూత్రధారణం
ఓంశివాయేతి మంత్రేణ పూజాయిత్వా చ పాలికాః 21
ఓం హ్రాం శక్తి వౌషట్ మంత్రేణ శాలిపిష్టం సమాదిశేత్
మంటపావాహనార్థంతు తండులంద్రోణపంచకం 22
చతుష్కోణాం సమంకుర్యాద్దూర్ధ్వరేఖాందశస్మృతః
తిర్యగ్రేఖాదశంచైవ లిఖ్యతాం శిల్పికోత్తమః 23
యేకాశీతిషుకోష్టంచ ఉద్ధరిష్యయధాక్రమం
యేతేగురు ప్రకారంచ తత్సంభారంవిశేషకం 24
లఘుప్రకారతో వక్ష్యే సావధానే నతుశ్శృణు
వాస్త్వర్థం ప్రథమంచైవ అధవావాస్తుమేవచ 25
ద్రోణద్వయంతండులస్యాన్నిక్షిపేన్మంటపాంతరే
షడ్రేఖావిలిఖేత్పూర్వంతిర్యగ్రేఖాస్తథైవచ 26
పంచవింశతి కోష్టేషుకోష్టమధ్యేయథావిధిః
మయకుంభంతు నిక్షిప్య తత్కుంభస్యసమావతః 27
పాలికాషోడశంచైవఅథవాచాష్టపాలికాః
నిక్షిప్యానంతరం చైవకలశం షోడశంతధా 28
అథాష్టకలశాన్వాపిస్థాపయేచ్ఛిల్పి కోత్తమః
శిషోవాచ;—
పాలికేకేనసంఖ్యేనకలశంచైవమేవహి 29

నిక్షిపేద్యత్రయత్రాపివక్తవ్యం విభుధోత్తమ
గార్గేయఉవాచ:—

పాలికాషోడశంత్వత్రకలశాష్టకమేవచ 30
పాలికాచాష్టకుంచైవ షోడశం కలశంతథా
కుంభస్యత్వష్టకోణేషుపాలికాస్థాపినిర్దిశేత్ 31
తద్వచ్చోడశభాగేషు కలశాంవినిక్షిపేత్
మృదంపృథ్వీతిమంత్రేణ పాలికాయాంవినిక్షిపేత్ 32
ప్రథమంజజ్ఞేతిమంత్రేణపంచపల్లవమాదిశేత్
గాయత్రీత్యేవ గోమూత్రందధిక్రావణ్ణేతిగోదధి 33
కాండాత్కాండేతి దూర్వాంస్యాత్ ఓషధయఃత్సమోషధిః
దూర్వామశ్వత్థ పర్ణంచ శ్వేతసూత్రంవిశంబకం 34
త్రింశద్ధర్భైనసంకూర్చ అష్టదర్భైస్తు బంధయేత్
తత్కూర్చమయకుంభేతునిక్షిప్యా సహాపల్లవైః 35
సముద్రాయేతిమంత్రేణ జలమాపూరకం విధు
ఓంమయాధిప నమస్తుభ్యం ధేనుముద్రాంప్రదర్శయేత్
అస్యశ్రీబ్రహ్మా ఋష్యాది పంక్తిచ్ఛందేతి మంత్రవత్
మయదేవోస్త్వియంబీజం ఆకారశ్శక్తిరుచ్యతే 37
నమఃకీలక మంత్రంచ అధిష్టార్థేనియోగతః
ఆప్యాయస్వేతి మంత్రేణ గంధపుష్పేణ పూజయేత్ 38
ఆధారశక్త్యావరుణం మయంపూజ్య సమావిధుః
ఓం, హ్రాం, మం, యం, సం, హ్రీం, హ్రూం హేంఅమృతేశాయ తేనమః 39

షడంగన్యాస పూర్వంస్యాత్ ఆధారావరణాంతకం
అమృతాద్యైతారుకాద్యై జ్యోతిరూపాయ తేనమః 40
చిత్రసింహాసనాసీనంకుందస్ఫటిక సన్నిభం
ప్రభామండల సంయుక్తం ద్విబాహుంచద్వినేత్రకం 41
కమనీయాంచి తాత్మానం దక్షిణేజపమాలికా
వామేపియ్యాప కుంభంచ భావయేత్పరికల్పితం 42
వాహనాద సముద్రంచ ప్రథమావరణపూజయేత్
రోహిణ్యాదిత్యత సైస్మవ రేవత్యైతరణేనమః 43
ఆర్ద్రాయుతజ్యోత్స్నాయః తేనా మాదికంక్రమాత్
ద్వితీయ్యా వరణపూజాంచసూర్యాద్యష్టగ్రహాణ తథా 44
త్రితయావరణం పూజచతుర్థావరుణ మేవచ
ఇంద్రాదిభిస్తు పూజాచపాలికాకలశాసుచ
ఓం హ్రాం వ్రాదయాయేతినమో మంత్రేణధ్యాయయేత్
మృత్తికేహన మేపాపం పంచామృతేన ప్రోక్షణం 46
అప్యాయస్వేతి మంత్రేణ సంప్రోక్ష్య కలశోదకమ్
భవసర్వజ్ఞ ఈశానః పశుపత్యగ్రికోత్తమః
రుద్రోభీమో మహాదేవాః పాలికాస్వధిదేవతాః 47
పూర్వం ప్రాక్పాలికాయాంతు జలపూర్వకమగ్నికం
పరందక్షిణా నైరుత్యాం పశ్చిమం వాయవేతథా 48
కుబేరేశానదిక్షుస్యాత్ పాలికాజలపూరణం
ఇంద్రం సూర్యంచ నైరుత్యాంపశుపతి దక్షిణేవచ 49
అజమూర్తిర్వరుణభాగేజ్వలతం వాయుమేవచ

రుద్రంకుబేరదిగ్భాగే భీమమీశాన మేవచ 50
మహాదేవోహ్యధిష్టాచ యేతేషావాహనంకురు
శరావేషు బ్రహ్మమావాహనధ్యాయేతు పూర్వకం 51
త్రయమూర్తి త్రిమూర్తీశః పద్మాక్షఃపద్మయోనిజః
చతుర్భుజస్తథాధాతా పితామహా అజస్తథా 52
పూర్వాజేత్రయమూర్తిశ్చాదావాహనమితీరితం
ఓంభువస్త్రయ మూర్తించ ఆవాహ యతుదక్షిణే
ఓగ్ంసువెళిపద్మాక్షమావాహాయితునైరుతౌ
ఓంమహాపద్మయోనిస్యాత్ ఆవాహాయతుపశ్చిమే 54
ఓంజనశ్చతుర్భుజస్య ఆవాహ యతువాయువే
ఓగ్ం సత్యపితామహాశ్చ ఆవాహాయతుచోత్తరే 55
ఓంతత్సవితుర్వరేణ్యం అజమావాహ్య మీశతః
ఘటికావిష్ణుమావాహ్య శిల్పాచార్యస్తతఃపరం 56
కేశవోమాధవశ్చైవ నారాయణ త్రిపక్రమః
పద్మనాభో మధురిపురితి మంత్రేణ విన్యసేత్ 57
ఓం ఇంద్రంచ కేశవంచైవ ఆవాహ యతుపూర్వకం
అగ్నింమాధవమావాహ్యత్వగ్నికోణే యజేత్తథా 58
యమం నారాయణంచైవ మావాహాయతుదక్షిణే
నైయతౌత్రివిక్రమంచ వరుణే వామనంతథా 59
వాయువ్యేచాచ్యుతంచైవ కుబేర విష్ణుమేవచ
ఈశాన్యేపద్మనాభంచ ఆవాహ్యేతాంస్తుసాక్షతాన్ 60
తిలసర్షపమాషాది ముద్గగోధూమశాలికాః

ప్రియంగుకోద్ర వాశ్చైవ కుళుద్ధంచణ కేతియత్ 61
దశదాన్యంచ స్వీకార్యం శిల్పాచార్యేణ తత్పరం
ఓం హ్రాం శివాయనమ ఇతి ఓం హ్రాం తత్పురుషాయనమః
ఓం అఘోరాయేతి ద్యోజాతం ఓం వామదేవాయ ద్యేవతు
సద్యోజాతేతి మంత్రించహ్యానువాకేవ సంప్రతి
ఓషధయస్సంవదంతీతి ప్రతివాక్యేన మిశ్రితం 63
ఓం హాం హృదయాయేతి ఓం హ్రాం శిరసేస్వాహా
ఓం హ్రైం శిఖాయైవౌషట్ ఓం హ్రాం కవచాయహుం
ఓం హ్రాం నేత్రికంచైవ ఓం హ్రాం అస్త్రాయఫట్
ఏవంచహృదయన్యాసంకుర్యాద్వైశిల్పికోత్తమః 64
త్రియంబకేతి మంత్రేణ ఓం సహ బీజాని సంగ్రహేత్
॥శరావేషః॥ బ్రహ్మజజ్ఞానమంత్రేణ తేషుబీజాని వాపయేత్
ఇదంవిష్ణుబుచాతాసుమృత్తికాచ్ఛాదనంతతః
మయకుంభంతు సంపూర్య కలశం పాలికాసహ 66
ఉదకేనైవ ప్రోక్ష్యేతధూప దీపాదికంతతః
తాంబూల దక్షిణాదీని స్థపతిర్బ్రహ్మణాసహ 67
యావత్కర్మకృతంచైతి చ్ఛిల్పాచార్యస్సమాచరేత్
అర్చకేనాద్విజేనాన్యేన్యనకే నాపివాకృతం
దేశగ్రామాద్యరిష్టంచ బింబస్యారిష్టకం తథా
పూర్వాచార్యానుగశ్శిల్పాచార్యః కుర్యాద్యథావిధి

శిష్యోవాచ—

పూర్వాచార్యస్తు కోవాత్రితద్వంశానుగ వుచ్యతే

కోవా న్యైర్నిరశితం కార్యాకి మస్మాద్బ్రాహ్మణాదిభిః

గాంగేయోవాచ —

త్వష్టాకృతయుగాచార్యస్త్రేతాయాంగిప్రతిస్తథా
ద్వాపరేవిశ్వకూపశ్చ కలౌబోధాయనస్స్మృతః 71
గాయత్రీచశచీసంజ్ఞా సావిత్రీచ సరస్వతీ
ఏతాసాంపంచ పీఠానామాదాతుర్యాశ్రిసుస్థితాః 72
విశ్వాత్మకో వామదేవోబోధాయనసనాభసా
శుశ్రివర్ధన బ్రహ్మర్షిగాచార్యత్వం ప్రచక్షతే 73
ఆచార్యో శ్రీముఖోనామత్వష్టపుత్రోమహాతపాః
సర్వేషామపివర్ణానాం గురుత్వ మగమత్పురా 74
ఏతదాచార్యవంశేతు యశ్శిల్పాచార్యఉచ్యతే
సఏవ వేద వేదాంగశిల్ప శాస్త్రార్థవిద్గురుః 75
వినాశిల్పితుయఃకించన్న కుర్యాత్ఫలభాగ్జనః
తస్మాత్సర్వ ప్రయత్నేనస్థపత్తైనెవకారయేత్ 76
యద్యన్యథాకృతంచైవ కర్తవంశోవినస్యతి
నాస్మాకం చతథాకర్తుంకిముతాన్యైస్సుధీవర 77
బ్రాహ్మణ్యంద్వివిధం ప్రోక్తంపురావ్యాసమహర్షిణా
సృష్ట్యాదౌబ్రహ్మణోజాతాస్సానగాది మహర్షయః 78
తద్వంశజాస్తువిశ్వేయే బ్రాహ్మణాఃప్రథమోద్భవాః
శతంచవింశతిః పంచగోత్రోద్భవ మహాజనః 79
విరాట్పంచముఖాజ్జాతాస్తే మన్వాదయ ఈరితాః
తత్రఏవశివోవిష్ణుబ్రహ్మేంద్రశ్చ భాస్కరః 80

త్రేఽ యోని సంభవాః   పంచలోకానాం ఘోడిమూర్తయః

తస్మాత్తే సర్వపూజాస్యాల్లోకోత్కృష్టవిభోజ్వలః   ౭౧

అథాస్మాకంతు బాహ్యాన్యా జ్ఞానసామాన్యతోఽధి

నజాత్యాగతమస్మాత్తద్విజత్వం నామసార్థకం   ౮

అతఏవ ప్రతిష్ఠాయాంస్థపతిగ్నాఖ్యాకారణం

తస్మాత్తద్వంశజాతానామాచార్యత్వం ప్రచక్షతే

ఇతిగార్గేయప్రోక్తే సంకల్పాంకురారోపణం నామ

ద్వితీయోఽధ్యాయః

# అథ తృతీయోఽధ్యాయః

## వాస్తు హోమః

ద్వాత్రింశదంగుళంచైవచతుష్కోణంచతుశ్రమః

త్రివేదిసంయుతంచైవ విస్తారచతురంగుళం   1

ఊర్ధ్వభాగచతుష్ప్రోక్తం వేదికాలక్షణంతథా

గోమయేనవిలిప్యాచ కుండాలంకారకంతథా   2

తతోంభూరితిమంత్రేణ అగ్నింసంస్థాపయేత్తతః

స్రుక్స్రువంచత్రిభిఃప్రోక్తం రేఖాఃకుర్యాద్యథావిధిః   3

పశ్చిమాత్పూర్వభాగంతు దక్షిణాయా ఉదగ్దిశం

భూర్భ్వమంత్రేణ సంప్రోక్ష్యాయింధనం మదనాగ్నిషు   4

కుండమధ్యేప్రతిష్ఠాప్య కరస్పర్శసమాదిశేత్

ఓం=అం=ఇం=ఊం=ఓమిత్యేవమంత్రేణజర్ఘకర్త్రాత్రి

భిశ్శుచిః   5

సుసమింధనజ్వాలాయాం ప్రాదర్భాంచగృహీతవాన్
అగ్నింధ్యాయేత్తథాప్రోక్తం వేదమంత్రేణచోదితం 6
ద్విశీర్షంచద్వివక్త్రంచ షణ్ణేత్రంచద్వినాసికం
చతుశ్శృంగాశ్రితత్వజ్ఞం సప్తజిహ్వాసమన్వితం 7
జటావల్కలబంధంచ సప్తహాసేన వైధృతం
ఉపనీతసమాయుక్తం రక్తవస్త్రోత్తరీయకం 8
ప్రోక్షణాత్ స్రుక్స్రువంపూర్ణంతోమరంవ్యజనస్యచ
ఘృతపాత్రధరందేవంయజ్ఞేశాయనమోస్తుతే 9
ఏవంధ్యాత్వాతథాచాగ్నిం ఏవమిత్యేవచాక్షతాః
ప్రాఙ్ముఖామభికుర్వంస్తంమమాభిముఖతోభవేత్ 10
తత్ప్రాగ్దక్షిణభాగైశ్చ పశ్చిమోత్తరభాగయోః
దర్భాన్ పరిస్తరంచైవ గంధపుష్పాక్షతైస్సహ 11
బ్రహ్మాణంచతదావాహ్య పశ్చాత్ప్రానఃపాత్రకం
ద్వంద్వంచ పాత్రకంచైవ ప్రయుక్తిమథాచరేత్ 12
దర్వీమాజ్యస్యస్థాలీంచ యావ్యాధసమంత్రవత్
ప్రోక్షణేపాత్రమాసాద్య త్రియంబక ఋచాతత 13
త్పాత్రమాదాయతస్మింస్తు చోదకం పూరయేత్తతః
కుశాక్షతాన్ వినిక్షిప్యవితస్తిమాత్రదర్భకం 14
సాదయేత్త్రిభిరాప్నోతి పునర్దర్భేషుప్రోక్షయేత్
ఉత్తానానికృతంప్రోక్తం త్రిభిఃప్రోక్షేత్పునఃపునః 15
పూర్ణపాత్రంసమాదాయ పూర్వంతత్కృతసాదకం
ఉదకేషుచసంస్థాప్య దర్భాసగ్నావిసర్జయేత్ 16

కుండేషుపశ్చిమేభాగే అగ్నింనీత్వాబహిర్గతిం
అగ్నాస్థాప్యాజ్యపాత్రేతు ద్వాదర్భాంచప్రిదగ్ధకం 17
ఆజ్యమధ్యేతు నిక్షిప్యతత్పవిత్రం విసర్జయేత్
ప్రాగగ్రేణైవచాగ్నౌతుస్రుక్స్రువాదాయ తత్పరం 18
జలైః ప్రోక్షాళసంకృత్వా దర్భైస్సహతదగ్రితః
ప్రోక్ష్యదర్భాగ్నికందత్వాపునరింధనమాగృహేత్ 19
ఏకవింశేంధనంప్రోక్తం ద్విరావృత్యభికారయేత్
త్రిభిస్సమిదకంగ్రాహ్యాదక్షిణోత్తరభాగను 20
ఉత్తరంచప్రతిష్ఠేత ద్వావేతౌ సమిధౌకృతౌ
దక్షిణేతుపరంస్థాప్యస్థపతిస్రుక్స్రువాధృతః 21
అదితేనేతిమంత్రేణ పరిషిచ్యాగ్నికుండకం
ఇధ్మమష్టాదశంధార్య ధ్యాత్వాగ్నించతతః పరం 22
యిధ్మంజుహుయాదగ్నౌతు కళాసాన్నిధ్యకారణాత్
ముహూర్తస్సుముహూర్తోస్తుపతేచ్ఛుభకరంభవేత్ 23
దర్వ్యాజ్యేః సంగృహ్యహోమంకుర్యాద్యథావిధిః
ప్రజాపతయేస్వాహేతి మంత్రేణస్థపతిక్రియా 24
ద్వాయువ్యాద్యాగ్నేయాంతంజుహుయాత్క్రిమశః పునః
నైరుత్యాదీశానాంతంచయిందాన్యస్వాహామంత్రవత్ 25
జుహుయాన్యనంతరంచైవ యిధ్మమాజ్యంసహోధృతః
వాయువ్యాదాగ్నేయాంతం బ్రహ్మమంత్రేణహోమకం
పునస్రుక్స్రువమాద్యాంచగృహీత్వాశిల్పికోత్తమః
నైరుత్యాదీశానాంతంచ బ్రహ్మమంత్రేణ స్వాహాకృత్ 27

జుహుయాద్ధ్యానంతరం చైవ స్రుక్స్రువాజ్యంగృహీతవాన్
నైఋత్యాదీశానాంతం చ జుహుయాద్విష్ణవే స్వాహా 28
వైశ్వానరాయ విద్మహే జాతవేదస ధీమహి
లోహితాక్ష ప్రభో దేవ మేవం మంత్రేణ హోమకం 29
అష్టవారం చైవ హోమం శిల్పాగ్నించ ప్రతిష్ఠయేత్
ఓం శివా శివమూర్తిశ్చ శివాయ స్వాహా మంత్రకం 30
హ్రాః హ్రాం హ్రీం క్లీం శ్చ మంత్రేణ హూం హ్రైం హ్రాం
చవిధిస్తథా
హ్రీంకరాదిషు చాంగేషు న్యాసమంత్రేణపూర్వకం
స్వాహానుసంధిజుహుయాత్ ప్రతిష్ఠాశ్చ శివాలయే
విష్ణ్వాలయప్రతిష్ఠాయాం విష్ణవే మధుసూదనే 32
నారాయణేతి మంత్రేణ జుహుయాత్స్వాహాపూర్వకం
అంగన్యాసకరన్యాసం జుహుయాత్పూర్వమేవతు 33
తత్పరం శిల్పినస్సర్వే ధ్యాయేచ్ఛిల్పాగ్నిదైవతం

ధ్యానం—

ధ్యాయేద్బ్రహ్మాండరూపం లలితమణిగణాం పీతనీలాదివర్ణం
జష్టంణ్ణేత్ర సప్తభుజగిరి పాత్రిం సప్తజిహ్వాంద్విశీర్షం
చక్రపాణించ ఖడ్గండమరుమృగధరం పుస్తకంచాక్షమాలం
స్వాహాశ్చబ్దస్వధాయుక్తం సురమునివినుతం శిల్పికుండాగ్నిమీళే।
యేవంధ్యాత్వాపరంచైవ తర్పణంకారయేద్విధిః
అగ్నించవీతిహోత్రంచ జాతవేదసమాత్మనః 35
వైశ్వానరేణ మంత్రేణ తర్పణంచైవకారయేత్

ఆధారశక్తిమారభ్యసహస్రాంతమావహేత్ 36
పశ్చాద్దేవంపంచపూజాం కుర్యాత్తాంబూలదక్షిణాం
పంచబ్రహ్మప్రధానాంతు హోమంకు ర్యాద్యథావిధిః 37
సద్యోజాతేతిమంత్రేణ స్రుక్స్రువం చ జుహుయాయకం
వామదేవేతిమంత్రేణ జుహుయాదాజ్యమేవచ 38
అఘోరేభ్యేతిమంత్రేణచరుహోమం యథావిధి
తత్పురుషాయేతి మంత్రేణలాజహోమంతథైవచ 39
ఈశానరితిమంత్రేణ షర్షపాతు(?)రు హోమకం
హృదయేన యవంచైవ శిరోమంత్రైవ కాస్థిలాః 40
శిఖామంత్రేణమాషాశ్చ కవచంచైవముద్గకాః
నేత్రేణాపూపకంచైవ అస్త్రమంత్రంచసక్తునా 41
స్త్రవంచవాస్తుహోమంచ శిల్పీకుర్యాద్యథావిధి
తత్పరంవాస్తుహోమంచకుర్యాత్ శాస్త్రవిధానతః 42
వాస్తోష్పతేతిమంత్రేణ హోమంచాష్టోత్తరంశతం
తతఃపరంచ కుండంచ అదితేనైవ మన్యునా 43
మంత్రేణపరిషిచ్యాథ కుర్యాచ్ఛిల్పియథాక్రమం
నారికేళంచ ఖర్జూరం గుడంకార్పాసకంతథా 44
సువాసపదవ్యయుతం చాందనాసింధనాన్యపి
చాన్నంక్షీరందధీవస్త్రం మధుయజ్ఞోపవీతకం 45
కాంచనం నవరత్నంచ స్వర్ణసూత్రేణ వేష్టయేత్
అజేనసహితంచైవ దద్యాత్పూర్ణాహుతింతతః 46
వాస్తోష్పతేనమంత్రేణ దత్వార్ఘ్యానంయథావిధి

కుర్యాదనంతరం చైవ పునః పూజాంచ కారయేత్ 47

ఇతి గార్గేయప్రోక్తే వాస్తుహోమవిధింనామతృతీయోధ్యాయః

---

# అథ చతుర్థోఽధ్యాయః

## వాహనారోహణపురప్రదక్షిణం

శిష్యోవాచ—

హేస్వామిన్ శిష్యవాత్సల్యాద్దయాంకురు మయిప్రభో
తతఃకిమత్రకర్తవ్యం వక్తవ్యంమమదేశిక 1

గార్గేయోవాచ—

పూర్ణాహుతేఃపరంకార్య మిదంశృణుమనాకులః
గజాశ్వహంసవృషరా ద్గరుడాదావపిస్తథా 2
సింహంచ శకటంచైవ విమానంరథమేవచా
పర్వతం రావణంచైవ నానావిధవిశేషతః 3
డోలభేదాద్వాహనంయత్ర బింబారోహణమాచరేత్
బింబాలంకారకంకృత్వా నూత్నవస్త్రాదిభూషణైః 4
పుష్పగంధాదిభిర్వ్యాప్తం వాద్యఘోషపురస్సరం
శిల్పాచార్యస్సదాతిష్ఠే బింబపార్శ్వేత్వతంద్రితః 5
యజమానసహాచైవ స్వస్తివాచన పూర్వకం
నృత్యగీతాది సంయుక్తం సర్వసైన్యసమావృతం 6
గ్రామప్రదక్షిణంకుర్యాత్ నీరాజనపురస్సరం
దేవాలయాగ్రేబింబస్యసర్వైర్ద్రష్టంతు మండనం 7

తద్విస్రుజాస్యవస్త్రంచ ధారయేచ్ఛిల్పికోత్తమః
కూష్మాండస్ఫాటితంచైవనారికేళంత్యథావిధి
యేభూతాపరిచరంతీతి హాఽద్రాన్నంబలిర్యథా
యేతేసర్వాఃశికర్మాణి కుర్యాచ్ఛిల్పివిచక్షణః
పశ్చాద్బింబంయథాప్రోక్తం శాలాంతరప్రవేశయేత్
శిల్పశాస్త్రాదిషైరేవం నిర్ణితఋషి సత్తమైః

ఇతిగార్గేయప్రోక్తేమహానారోహాః పురపాదక్షిణాంనామ
చతుర్థోఽధ్యాయః

# అథపంచమాఽధ్యాయః

## మృత్పంచకస్త్రపనం



శిష్యోవాచ—

శ్లో॥ తతఃపరంతుకింకుర్వంఉవాచసురసన్నుతా

గార్గేయోవాచ—

మృత్తుకాస్త్రపనంచైవకురుతాంశిష్యభూషణః

శిష్యోవాచ—

కథంవామృత్తుకాస్నానమంత్రింకింతత్రవర్తతే
కుత్రస్నానంప్రకుర్వీత ఉవాచకిం ప్రయోజనం

గార్గేయోవాచ—

ఆలయస్యోత్తరేభాగే చేశాన్యేపూర్వభాగకేః
త్రిహస్తంద్వయమేకంవా చతుష్కోణంచగర్తనం 3
హస్తంవాపితదర్ధంవా ప్రమాణంఖననంభవేత్

